జై హింద్

# పోలీసు చర్యలు

# బుఱ్ఱకథ



గ్రంథకర్త:

## అద్దూరి అయోధ్యరామకవి



ప్రకాశకులు:

కొండా వీరయ్య

పుస్తకముల వ్యాపారము

మహాకాళి వీధి, సికింద్రాబాద్.

1948



వెల 0-4-0

జై హింద్

# పోలీసు చర్యలు

# బుఱ్ఱ కథ



శ్రీ జయ వీర భారతికే జయము దిగ్విజయము
నైజాం భూమిని నడిచిన గాథను చెప్పెదము వినుడీ
జయము జయము మన భారతమాతకు జయము దిగ్విజయము
జయము జయము మన స్టేటు కాంగ్రెసుకె జయము దిగ్విజయము
జయము జయము మన పండిత్ జీకే జయము దిగ్విజయము
జయము జయము మన సర్దార్ జీకే జయము దిగ్విజయము
జయము జయము మన స్వామీజీకి జయము దిగ్విజయము

**1.** వం:—ప్రతి కథకు ఇంతే ఇక కొలుపు చాలించి కథ మొదలుపెట్టు వీరంతా ఎక్కువ సేపుండ లేరు అనవసర కాలయాపనతో.

**2.** వం:—నాంది ముగిసింది. నీవుంటే ఏ కథ కొనసాగింది బాగా గప్‌చుప్‌న వినాలి.

కథకుడు:—

భారత దేశము సర్వస్వాతంత్రత బడయుటకొరకయ్యా
పోరాటమ్ములు ఎన్నో చేసిన ఫలితమ్ముగానూ
పండిత నెహ్రూ పరిపాలనకీ భారత దేశమునూ

వప్పచెప్పుచు ఇంగ్లీషోరు నిష్క్రమించినారూ
పండితునకు మన సర్దారుపటేల్ సాయకుడయ్యాడు
ఐతే తెల్లలు భారతభూమిని ముక్కలె చేశారో
పాకిస్తానని హిందూస్తానాని రెంటితో పోసిరా
సంస్థానాలను చిన్నముక్కలీ రెంటిలో బెట్టారు
ఐనా మన సర్దారుపటేల్ కృషి ఫలవంతంబయ్యె
భారతభూమిని గలసంస్థానాల్ బుద్ధి తెచ్చుకోనెరా
కాశ్మీరొక్కటి నైజామొక్కటి మిగిలిపోయెనండీ.

ఐతే ఇందులో కిటుకేముందంటే ఈ సంస్థానాలు ఏ యూనియన్‌లోనైనా చేరవచ్చును లేదా స్వతంత్రంగా ఉండొచ్చునని బ్రిటిష్‌వారనడంవల్ల అలా చేశారు. మిగతా సంస్థానాలన్ని యూనియన్‌లో చేరిపోగా మిగిలిన ఈ రెంటిలోనూ?

కాశ్మీరముపై పాకిస్తానీల్ తందానో తానతందాన
దుండగీంద్రడనే ప్రోత్సహించిరి ,,
కాశ్మీర్ ముట్టడి కుపక్రమించిరి ,,
శ్రీనగరమునకు ముప్పై మైళ్ళు ,,
చేరవచ్చెడి విధమునుజూచి ,,
కాశ్మీరురాజూ భారతసర్కార్ను ,,
ప్రార్థనచేసెను బహువిధములగానోయి
తందానో ఓ దేవనందనాన.

1. వం:—రాజు ప్రార్థనచేయంగానే మనవారు పెట్టుబడిదారీ ప్రభుత్వంవలె లొంగిపోయార్రా?

2. వం:— కామురా! అదివరకు ప్రజాప్రభుత్వ స్థాపనకై బందిఖానాలోఉన్న షేక్అబ్దుల్లాను విడిపించి ఆయన ఎలాచెబితే అలా చేస్తామన్నారురా! నీవిలా ప్రశ్నిస్తే మన భారతప్రభుత్వాన్ని పెట్టుబడిదారీ అన్యాయవంతే కమ్యూనిష్టువని అప్పగిస్తామునుమీ జాగ్రత్త! గడియ క్షోకరంగు మార్చుకు...

కథకుడు:—

అప్పుడు షేఖబ్దుల్లాగారిని విడుదలనేచేసీ
తాత్కాలికముగ భారతసర్కార్‌తో సంబంధమ్మూ
పెట్టుకోనెరా ప్రజామండలి కప్పగించిసర్వాం
నాటినుండియు మనసేనలు అల పోరాడుతున్నాయి.

కాశ్మీర్ సమస్య ఇటులా సై
పరిష్కరింపగ బడియెరా సై
నైజామే మిగిలిపోయెరా సై
సర్దారు నయమునబల్కెరా సై
ఐనను నైజాము లొంగడే
అన్యాయంబును విడువడే
భళానోయిభాయి,

అందుకు తోడు,

ఒక్క ప్రణాళిక నిచ్చెరా సై
ఇత్తెహాదుల్ ముసల్మీనురా సై
ఎన్నెయో ఆశలు జూపెరా సై
అన్నింట నవ్వాబునమ్మెరా సై

కాలగతి దలపోయకా
విరప్పీగరా మందుడై.

అంతకు క్రితమే,

ఎన్నో రీతుల బోధసేసినా వినవట్టీ ప్రభుకూ
విప్లవమంటే ఏమిటో తెల్పగ స్టేటుకాంగ్రెసపుడూ
నడుముగట్టెరా దేశమ్మునకొక పిలుపునివ్వగా చే
కోర్టులనుండీ లాయర్లందరు వృత్తి వదిలినారూ
విద్యార్థులుబడి కేగక చదువుల్ మానివేసినారూ
ప్రతిఇంటిపై భారతజెండా రెపరెపలాడిందీ
ఆ ఝండాలను ఎగురవేయగా నైజాం సర్కారూ
దాదాపిరువది వేలమందినే జైలునబెట్టాకా.

1. వం:—ఈలోపుగా ఈ ఇత్తెహాదుల్ ముసల్మీన్ ఏం చేసిందిరా ?

లక్షలభారత యూనియను ముస్లింలను రప్పించీ
రజాకారులను పేరున ఉద్యమ మొక్కటినిర్మించే
తమకు సలామనువారినె హిందూమంత్రులనుజేసీ
మిగతామంత్రుల తమఅనుచరులనె స్థానములిప్పించే.

1. వం:—ఐతే ఇంకేముంది? ప్రభుత్వం వారిదే ఐంది. ఏదిష్టమొస్తే అదే చేశారనుకుంటాను విచ్చలవిడిగా.

కథ:—ఔను. బయటినుండి కొందర్ని ధనాశలు చూపి రప్పించటమూ, ఇక్కడున్న వార్ని బయటి యూనియన్ ప్రాంతాలకు వెళ్లగొట్టటమూ, మిగతా ముస్లిమేతరులని ఝడిపించి, బాకులుచూపి, నానాహింసలుపెట్టి లొంగదీసు

టున్నారు.

కొంచెం ప్రజలెట జాగరూకులో తందానో
ఆయూరంతయు కాల్చి వేయుచు ,,
లక్షలఆస్తుల దోచివేయుచు ,,
మానవతులనే అపహరించుచు ,,
యువకులందర్ని జైలునద్రోయుచు ,,
నానాహింసల పెట్టుచునుండిరోయీ
హరి హరి తందానో.

భారతజెండా కనిపడితేనే పీకివేయువారూ
ఆగష్టుపదిహేను వలభై ఏడున స్వాతంత్ర్యపర్వాన
ఇట్టికేసులే కొన్నిజరుగగా అడిగెనిజామూను
నిజమిదికాదని భారతసర్కారతో బొంకాడండీ
ఎక్కడజూచినా ఆ ఝండా కనపడగా మతిబోయీ
ఝండాకడితే కఠినశిక్షయని చేసినఫర్మానా
రద్దయిపోయెను కానిదుష్టులే రజ్జాకారూలూ
ఆఫర్మానా లక్ష్యపెట్టక హింసించారండీ
భారతమానము చెల్లదంచును తందానో
భూమానొకటి చేసెనిజాము ,,
భారతసర్కారు సంజాయిషడుగగ,,
బొంకి యాత్రికులకది కాదనియెనోయీ హరిహరి.

ఇట్లాంటి సంఘటనలు వందలకొద్ది జరిగినై.

1. వం:—రోజూ చచ్చేవాడి కెవడేడుస్తాడని మనవారూరుకున్నారా ?

2. వం:— రోజూ చావకుండా ఒకసారే చచ్చేట్లు చేశారు.

కథకుడు:—

అరెరెసర్దార్ హుంకరించెరా జునాగఢునుండీ
మెత్తటిమాటల లొంగడంచును విశ్వసించినారూ
భారతసేనలు తాత్కాలికముగ రప్పించుకున్నారు
శాంతిభద్రితలు నైజాంనెత్తిన బెట్టివేసినారు
ఒక్కయధాతధ పొడంబడిక చేసుకున్నారండీ.

1. వం:—ఇష్ ఎవడిరాజ్యానికి వాణివే అధికారం.

కథకుడు:—అధికారమా ? విను.

తేలుకుపెత్తన మిచ్చినట్లుగా మొలిగెనిజామండీ
రజాకారుల వీరవిహారము పెరిగిపోయెనండీ
రాజ్యములోపల శాంతిఎక్కడా పేరుకె లేదయ్యో.

ఐతే మొదటినుండియును ప్రజావాణియైన స్టేటుకాంగ్రెసు ఈ హైద్రాబాద్ రాష్ట్రం భారతయూనియన్‌లో చేరితీరవలె వనే చెప్పతూవచ్చింది. భారత ప్రభుత్వంకూడా ఇవే చెబుతూవచ్చింది. ఎందుకయ్యాంటే

పరిసరరాష్ట్రాలన్నియుదీనికె బంధముగలవయ్యా
భాషాసంస్కృతి భౌగోళికముగ వేరేకాదయ్యా
బ్రిటిష్‌వారి కుటిలఆఖరి రూపమెఇదిఅయ్యా!

యధాతధపు ఒడంబడిక నవంబర్ ఆఖరులో జరిగింది. ఆరు నెల్లకాలంలో అనుకోనన్ని ఘోరాలు జరిగినై.

ప్రతిదానికినీ భారతసర్కార్ ప్రతికూలముగానూ

ఖాసూన్లైనో్న చేయుచు బొంకుచు కాలముగడుపుచునూ
సిడ్నీకాటన్ వంటివ్యాపారుని చేతిలొనుంచుకొని
కోట్లడబ్బునూ లంచాలిస్తూ ఆటలాడువారూ
మారణాయుధాల్ మందుగుండునూ చేరవేసుకొనుచూ
రజాకారులను సైన్యములను అభివృద్ధిచేసి వారు
భారత దేశపు గర్భమునందే బల్లెములైనారూ.

ఇలాంటప్పుడు సాధ్యమైనంతవరకు రక్తపాతంలేకుండా లొంగ దీసుకుందామని విశ్వప్రయత్నంతో

మాటకుముందూ సంప్రదింపులని తందానో
ఢిల్లీలోపల బొంకుచువచ్చెడి ,,
నైజాంమంత్రి వర్గముతోడ ,,
జూనుఒడంబడికను నామముతో ,,
జేసుకొనుటకై సిద్ధముపడెరా ,,
అప్పటికైనా లాయఖాలీగూప్ ,,
ముజ్లిస్కూడిగి నిరాకరించెరా ,,
పుర్రెతొబుట్టిన బుద్ధెటుబోవునరోయీ హరిహరి.

1. వం:—ఆ ఒడంబడికే ఐతే ఏమౌనురా!

2. వం:—నీవూ నేను ఇప్పుడప్పుడే ఇలా బుఱ్ఱకథలు చెప్పలేకపోదుము. భారతప్రభుత్వం దీన్ని లొంగదీసుకునే వరకు చాలాకాలంపట్టేది.

కథకుడు:—

అప్పుడునైజాం రాజరికమ్ము అర్థమవ్వనంతా
రజాకారులా రాక్షసకృత్యాల్ కనివినిచూచారా

ఇకభరియింపగ లేమనివెంటనె వార్నింగిచ్చారూ

చెన్నపట్నముకు పండితనెహ్రూ వచ్చినసమయాన.

అదివరకే స్టేటుకాంగ్రెస్ వారు ఎప్పటికప్పుడు తెల్పినట్టి వివరాలన్ని మనస్సులో వుంచుకుని ఈ నైజాం రణానికి ఒక్క పోలీసు ఆపరేషనే మందని చెప్పాడు.

1. వం:—యుద్ధం చేస్తామన్నారు కాదురా నైజాం సర్కారోళ్ళు.

2. వం:—ఆఁ రోళ్ళే—యుద్ధమేమిట్రా? సాటివారైతే యుద్ధం—దీనికి సైనికచర్యలుకూడా కాదు, పోలీసు చర్యలు కావాలన్నాడు ఇంకానయం బాలభటుల చర్యలంటేనే ఐపోయేది.

కథకుడు:—ఇంకా చెప్పాలంటే ఈ రజాకార్లూ, లాయఖాలీ ప్రభుత్వం ఎలా సంచరిస్తుండేవారంటే,

మంచిమాటలను జెప్పుచూ సై
భారతసర్కార్ తోడుతా సై
వైరములే లేకుండుచూ సై
యూనియనున గలువుమనీ సై
హితవుజెప్పు వారెల్లరిని
హతముసేయు చుండినరూ
భళానోయి భాయి.

ఇమ్రోజుపత్రిక నడిపెడివాడగు షోయిబుల్లాఖానూ
ఒక్కనాటితన సంపాదకీయములో నటులేవ్రాయ
ఆ జాతీయ ముస్లింయువకుని హత్యజేసినారూ

ఇంకొక ఏడుగురిట్లులై ముస్లింసోదరు లనగానే
వారిపెన్షనుల్ బందేచేసీ నిర్బంధించారూ.

ఇంకా అదేరోజుల్లో శాస్త్ర ఏమున్నా తమ పదవితో సేవ చేద్దామనే వుద్దేశ్యంతో నిజాంప్రభుత్వంలోని మంత్రిపదవులలోనుండిన ఇద్దరు హిందూమంత్రులగు శ్రీ జి. రామాచారి, మరియు జె. వి. జోషీగారలుకూడా ప్రజలకు జరిగే ఈ అన్యాయాలనుచూసి

వినరా!

ఇక ఈక్రూర నిజాంప్రభుత్వమున మనలేమంచూనూ
వెంటనేతమవారి మంత్రిపదవులను వొదిలివేసినారూ
జే. వి. జోషీ ప్రకటన భారతసర్కార్ జూచిందీ
ఆచార్యుండగు భన్సాలీజీ ఈ దారుణములనూ
శాంచినవాడై నిరశనవ్రితమును పూననెపూనాడూ.

ఇక స్టేటుకాంగ్రెస్‌వారు ఎప్పటికప్పుడు తెలిపే సంగతుల వల్లా ఈ నైజాం సమస్య అఖిలభారత సమస్యగా మారి 30 కోట్ల ప్రజలకునూ అసంతృప్తిని రేకెత్తించింది. వెంటనే పండిత నెహ్రూ నిజాంకు ఈ క్రిందివిధంగా తెలిపాడు.

మా సేనలు మా బొల్లారము రావడానికయ్యే
ఏర్పాట్లన్నియు చేయగవలయును శాంతిని రక్షింపా
రజాకారులా రాక్షసకృత్యాల్ మీరు అణచలేరూ
శాంతిభద్రితలు మాసేనలుఅట నెలకొల్పగలవు.

కాని దీన్ని నిజాంనవాబు అంగీకరించలేదు. మరొక వారం రోజులు గడచిన్నై. అప్పుడు శ్రీ రాజగోపాలాచారిగారు

కూడా జెలిగా్రింద్వారా
ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని మా సేనలబిల్చి
శాంతిభద్రతల నెలకొల్పుటకై త్వరపడుటవసరమూ
రజాకారులను రద్దేచేసీ ముందును గురించా.
దీనికూడా నిజాంనవాబ్ ఆమోదించనేలేదు.

## పోలీసు చర్యలు.

నలభై ఎనిమిది సెప్టెంబరు పదమూడవ తేదీన
నైజాంప్రజలా దాస్యవిముక్తికి నాందిసూత్రమయ్యే
అష్టదిక్కులా భారతసేనలు నడువసాగినాయీ
స్టేటుకాంగ్రెస్ వాలంటీర్లు తోవనడుచుచుండా
విజయవాడలో కదలిన సైన్యం వడివడిపరుగెత్తి
బొమ్మకల్లునే ఆక్రమించెరా మరియొకదళమపుడే
కోదాడునే కొట్టివేసె రజకారుల నెదిరిస్తూ
షోలాపురము నుండి నడిచెడి సైన్యముకదలిందీ
నల్లదుర్గమున రజాకారులను మట్టుపెట్టినాదీ
వైరులుగూడా బలమగు ఘర్షణ చేసినారువినరా
కర్నూల్నుండి వచ్చెడి సైన్యము హొస్పేటను జేరె
విసనకర్ర వ్యూహమ్మున వచ్చెడి భారతసేనలటా
కొద్దిపాటివే సంఘర్షణలను ఈగలవలెగొడుతూ
నాగపూరము నుండివచ్చెడి సేనలుఆరోజే
బల్హార్షాను స్టేషనునప్పుడె పట్టుకొనేనండీ
ఇది మొదటిరోజు వృత్తాంతము. ఎప్పుడైతే సేనలిలా
చొచ్చుకురావడం మొదలెట్టారో నైజాం సైనికులోనూ

రజాకార్లలోనూ చీలికలైనయ్. అప్పుడు రజాకార్లతో నైజాంసైనికు లేమంటారు?

ఆజాద్ హైదరాబాదు నినాదము తందానో
మాదరేవతనను మతవైషమ్యము ,,
లూటీ గృహదహనాల మజాలను ,,
ఢిల్లీబదలా దక్కన్ అనుటను ,,
సోదరీమణుల చెరగొను ఫలితము ,,
కన్నులారగా కాంచండోరయ్యోయీ హరిహరి.

రజాకారులను ముందుకునెట్టి వెనుకజరిగినారు.
భారతసేనకు ఫలహారమువలె దొరుకనె దొరికింది
చెట్టుచెట్టునూ పుట్టపుట్టనూ గాలించారండీ
రజాకారులకు నిలువునప్రాణా లెగిరిపోయెనండీ
"యాఅల్లా హమకూకోయితో బచావురే" అంచూ
ఒకతేపరుగున వెనుకవెనుకకే పారిపోయినారు
తెలతెల్లారెడి వేళ్ళకు రెండవరోజును కథవినరా
దౌలతాబాదను దుర్గము మనసేనలకే వశమయ్యే
ఖమ్మంమెట్టున మనసేనలు నైజామూ నెదిరించే
సూర్యాపేటకు దగ్గరదగ్గర జేరుచునుండెనురా
రాజసూరునేచేరి ఉస్మానాబాద్ పట్నానే
బీదరోరుగల్ విమానశాలలు ధ్వంసముచేయబడే
బాంబులవర్షము ఫెళఫెళమ్రోతల దిసలుభయముజెందే.

1, వం:—ఇంతైనా లోపల ఈ రజాకార్లు ఏ ఘోరాలూ చేయలేదురా?

2. వం:—15వ తారీఖున అింకూడా చేదామను కున్నారుకాని—తరువాత చెబుతానుకాని, ఒక వేళ అలాంటి ఘోరాలే జరిగితే రాష్ట్రంలోవున్న యావత్తు ముస్లిమేతరులను విమానాలద్వారా యూనియన్‌కు చేర్పింపటానికీ యత్నాలైవుండె. దీనికోసమై విజయవాడదగ్గర గన్నవరం విమానాశ్రయంలోనే 400 విమానాల నుంచారురా. ఇక మిగతాచోట్లల్లో ఎలావుండెనో యోచించుకో.

మూడవరోజుటి సంగతులన్నీ స్థిరముగానువినరా
ఆడకత్తెరవలె కత్తిరించిరీ ఔరంగాబాదున్
ఖమ్మందాటీ ఓరుగల్లువిగ నడుచుచుండెసేనా
బీదరుకూడా స్వాధీనమ్మై పోయెను వేగంగా
సూర్యాపేటను దాటివేసెరా శూరతజూపుచునూ.

నాల్గవరోజూ ఈ రంగాలల్లోనే వెదకడం, రజాకార్లను పట్టుకోడం, స్వాధీనమైన నగరాలను పునరావాసంగా చేస్తూ సాగుతూండిరి. ఐదవరోజున అనగా 17వ తారీఖున,

షోలాపూరూ విజయవాడల నుండిబైలుదేరూ
సైన్యాలన్ని ఎనభై మైళ్ళ చేరువనుండెనురా

అంతకుక్రితం రాత్రి అనగా 16వ తారీఖువరకు నైజాం సేనాధ్యక్షుడగు ఎ. అద్రూస్‌కు దక్షిణ భారతసేనాయును, ఈ పోలీసుచర్యల వ్యూహం నడిపించే కర్నల్ రాజేంద్రసింహజీ ఈవిధంగా సందేశం పంపాడు,

ఇప్పటికైనా మాసైన్యంబుల తండానో
వీరపరాక్రమ విధమునుజూచి ,,

మీరజకారుల క్షీణతగాంచి ,,
ఓటమినిక నే నొప్పుకొనుచు ,,
నిర్నిబంధముగ లొంగంపోయి ,,
రక్తపాతము మాన్పగవలెనంటేనో హరిహరి.

ఆసందేశము నైజాంనవాబు చూచినాడు బాబో
లాయఖాలీ మంత్రివర్గమ్మును రప్పించాడండీ
ఏమిచెప్పుతా రిప్పుడటంచును ప్రశ్న వేసినాడు
లాయఖాలీగ్రూప్ రాజీనామా పెట్టివేసినారూ
నవాబేపరి పాలనమంతా చేతికిదీసుకొని
చేసినదానికి వగచెదననుచును చెప్పంపీనాడు
రజాకారులను మీఇష్టముగా బంధించుమన్నాడు
శాంతిభద్రతలు మీరే సంరక్షించండన్నాడు
తానురజ్వీచే కీలుబొమ్మగా మెలిగితినన్నాడు
తనమాటలనే త్రోసిపుచ్చుచు బంధించిరన్నాడు
దయతోనిప్పటికేని తనను క్షమించండన్నాడు
వెంటనెనైజాం సేనలోడిన చిహ్నంబుగాను
తెల్లపతాకము నెత్తినారురా ఎల్లసిఫాయీలు
రాజేంద్రసింహుండు వెంటనే రాష్ట్రముకంతటికీ
మేజర్ జనరల్ చౌధరిగారిని రాష్ట్రగవర్నరుగా
నియమించాడు శాంతిభద్రతల నెలకొల్పంగానూ.

భారతసేనలు వచ్చెరా
భాగ్యనగరిని జొచ్చెరా
ఎదురేగి అద్రూస్ నిల్చెరా

భీతితో శరణుజొచ్చెరా
పరిపాలన తనచేతిలో
తీసికొనియె గవర్నరూ.

తాత్కాలికమగు సైనికపాలన సాగుచునున్నాదీ
అణువణువునే శోధించుచు రజాకార్లందర్ని
బంధించిరోయ్ సైనికాధికారులు శోధిస్తూను
రాష్ట్రములోనీ పల్లెపల్లెలో మోదములుప్పొంగే
అడుగడుగూనా ఈసైనికులకు స్వాగతమే వెలసే
రజాకారులా పీడవిరగడై పోయిందిగానీ
కమ్యూనిష్టుల కార్యముమాత్రము మిగిలియెయున్నాది
అదియునుకొలదీ కాలములోనే అంతమొందునండీ
ముందుభవిష్య త్కార్యక్రమమును బాగుగయోచించీ
ప్రజలపెన్నిధీ సమముగ వెలిసెడి స్టేటుకాంగ్రెసును
అన్నివిధాలా నమ్మి శ్రేయస్సొందుచునుమరువకుడి
మిలిటరిపాలన బోవుటతోడనె మీదెప్రభుత్వముగా
ప్రతియువకుడును ఓటిచ్చినట్టి వాడే ప్రతినిధిరా
ఆప్రతినిధులతో కూడినసంఘం ఆలోచించునురా
రాష్ట్రభవిష్య త్తంతయువారె నిర్ణయించెదరురా
ధర్మమున్యాయము శాంతిసౌఖ్యప్రాధాన్యముగా వెలయూ
రైతుకూలీప్రజ కష్టాలన్ని మాయమగునువినరా
హిందూముస్లిం భేదభావములు రూపునకుండవురా
హరిజనాది బాధావృతజాతికి కష్టములుండవురా
నీతినియమముచే పరిపాలన నిత్యముశోభిల్లూ

భారత దేశపు భాగమయ్యేమన రాష్ట్రము వెలయునురా
రామరాజ్యసమ రాష్ట్రంబొప్పి రాజిల్లునుగనరా
బోలో స్వతంత్రత భారత్ కీజై బోలో నెహ్రూకు
బోలో సర్దారు పటేల్ కీజై బోలో ఆజాద్ కీ
స్టేటు కాంగ్రెసుకు జయముజయమ్మను స్థిరచిత్తముతో డా
స్వామీ రామా నందతీర్థుని సర్దార్ కేశవుని
ఆచారీజీ బొమ్మకంటి మొదలగునీ నాయకులా
నాయకత్వమున నడిచిన మేలగు నంచునునమ్ముమురా!
జాగీర్దారీల్ అసమానత్వము రూపుమాపుటకునై
హరిజనోద్ధరణ దున్నవానిదే భూమియగుటకునై
స్టేటు కాంగ్రెసును మరువకున్నచో చేకురును మేలూ
నమ్మినవానికె ఫలితమునుమ్మా నామాటలవినుమోయ్
జయజయ జయజయ జయజయ జయజయ భారతికీజయహో.



కొండా వీరయ్య అండ్ సన్స్ గారి శ్రీభారతీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె, సికింద్రాబాదు.